# ఇందుమతీ పరిణయము

(గ్రంథకర్త:)

గుట్టం వేంకటసుబ్రహ్మణ్యము. బి. ఏ., బి. యల్.
నెల్లూరు.

Published by
VYSYA PRESS
Educational Publishers, Nellore.

# విన్నపము



కాళిదాసు రచించిన రఘువంశ మహాకావ్యములో 5, 6, 7 సర్గలందలి కథాభాగమును తెలుఁగుచేసి 'ఇందుమతీ పరిణయము' అను పేరుతో నేను బ్రకటింపసాహసించితిని. ఇది అనువాద మేగాని స్వతంత్రముగాదు. ఇందలి గుణసారము కాళిదాసునిది. అజ్ఞానవిలసితములైన దోషములు నావి. పాఠక లోకము గుణమును స్వీకరించి యీకావ్యమును ఆదరించునుగాక.

భోజమహారాజు తన చెల్లెలు ఇందుమతికి స్వయంవరము చాటినంతట, రఘుమహారాజు కుమారుఁడు అజుఁడు అయోధ్య నుండి బయలుదేరిపోయి, ఆకన్యనువివాహమై, మరల రాజధానికి వచ్చువఱకు నడచిన కావ్యభాగము ఇందు నిబద్ధమైయున్నది. స్వయంవరమునకే తేరుచున్న అజునకు మార్గమధ్యమున గంధర్వ కుమారునివలన గల్గిన అస్త్రప్రాప్తి స్వయంవరానంతరము రాజ కుమారులతోఁగల్గిన పోరాటమున విజయప్రాప్తికిఁ గారణమైనది. ఇందుమతి వరించిన అజుఁడు ధర్మశీలియు జయశీలియు నని ప్రత్యక్షముగా నిరూపితమైనది. వివాహగాథ విజయగాథ యైనది.

స్వయంవర సందర్భమునఁ గాళిదాసు కావించిన నానారాజవర్ణ నము సుకుమారము స్తవనీయమునై యున్నది. క్షత్రియకులో

చిత్రమైన విక్రమవిలాసములు దేశానుగుణ్యమైన భేదములతో నొక్కొక్క రాజు నందును చిత్రించిన విధము చూడఁగా, భారత వర్షమున ఆర్యనాగరికతకు నిదానములైన యీ రాజవంశములు పరంపరానుగతిగా గడించిన కీర్తిప్రతిష్ఠలు ముఖ్యవస్తువనియు ఇదెల్ల భారతరాజలోకమునకు మహాకవి విలువ గట్టుటయు మాత్రమేగాని వ్యక్తిపరమైన పొగడ్త కాదనియు స్పష్టము గాఁగలదు. నైషధమునందున్న రాజవర్ణనము అతిశయోక్తి భూయిష్ఠమైయున్నది. ఇందలి వర్ణనము విపరీతమునకు దిగక, ఉన్న గుణమునకుఁ గవి మెఱుగు వెట్టుచున్నాఁడేగాని లేనిది కల్పించుచున్నాఁడను తలంపునకుఁ దావీయక, చాలవఱకు సహజము ఉదాత్తమునై యున్నది.

ఈ నా తెలుఁగు సేఁతను చిత్తగించి పాఠకలోకము ప్రోత్సాహము నొసంగినచో, రఘువంశమును ఆంధ్రమున సంపూర్ణముగాఁ బ్రకటించి కృతకృత్యుఁడ నయ్యెదను.

గుఱ్ఱం వేంకటసుబ్రహ్మణ్యము.

---

# ఇందుమతీ పరిణయము



## ౧ ఆహ్వానము.

అల విదర్భేశ్వరుఁడు భోజుఁడాత్మభగిని
ఇందుమతికి స్వయంవరమేర్పఱించి
అజుని రావించువాఁడయి యాప్తునొకని
జాత్యమంపెను రఘుమహీధవునికడకు. 1

భోజ సంబంధ మది శ్లాఘ్యముగఁదలంచి
ఆత్మజు వివాహయోగ్య వయస్సు నెంచి
కొమరు నంపెను సేనతోఁగూడ రఘువు
తత సమృద్ధ విదర్భప్రధానపురికి. 2

## ౨ ప్రయాణము

దారి డేరాల యందుపచారములయు
గ్రామ జనములొసంగెడు కానుకలయు
కలిమి, మనుజేంద్రసుతు విడిదలలవన్య
ములు విహారోపవనకల్పములుగనొప్పె. 3

అరిగి, నర్మదదరిని దుంపురులఁదోఁగు
చివుల మ్రాఁకులఁ గదలార్చు మృదుసమీర
పాళికలరారి, విడియించె బడలియున్న
వాహినిక ధూళిధూసరధ్వజము నఱఁడు. 4

అంత నయ్యేటఁ బైపయి నళులు సుడియ,
మున్న దెలియంగనై మున్గియున్న తెఱఁగు,
క్షాళిత మదామలోన్మేష గండభిత్తి
వనగజేంద్ర మొకండందుఁ బైకిలేచె. 5

ధాతురాగము నిశ్శేషధౌతమయ్యు
నీలమౌ నిల్వుగీఱలు నిగలసీన
రాలచే మొక్కవడిన దంతాలు చాటె
ఋక్షవత్తట వప్రవిక్రీడనెల్ల. 6

వడివడిం దన తొండము ముడిచి చాఁచి
సద్దుసేయుచుఁ జెండుచుఁ బెద్దయలలఁ
గట్టుగడె మ్రాఁకులంజీల్చునట్టులొప్పి
గట్టుఁ జేరంగ వచ్చుచున్నట్టి గజము.

ప్రోదికాయముచే నెగఁద్రోయఁబడిన
నీటిమొత్తము మున్నెక్కె నేటిగట్టు
నాఁచుగుబురుల మొత్తముఁ లాగుకొంచు
గట్టు పొడవుగజంబెక్కె గట్టుఁబిడప. 8

నీటమునుఁగుట నొక్క తెప్పపాటుమాత్ర
ముడిగి, యయ్యేకగజగండయుగళిసీమ
లలిరహించెను మదవర్షలక్ష్మి మరల
గజముల నవన్యముల నటఁగనుటతోడ. 9

సప్త పర్ణపయఃకటుసాంద్రపూర
మోర్వరాని తదీయ మదోదకంబు
మూర్కొని చమూగజేంద్రముల్ మొగముఁద్రిప్పెఁ
దీవ్రమడగొట్టు మావట్ల ధిక్కరించి. 10

త్రెంచుకొనికట్లు వార్యముల్ దెరలఁబాఱ,
తేరులిరుసులు విఱుగుచు ద్రెళ్లఁద్రుటిని,
రామలం గావ జోదులారాటపడఁగ,
దండు విడిదల నది కలగుండొనర్చె. 11

పైకినడ తెంచుదాని నాఁపందలంచి,
పార్థివునకు వనేభమవధ్యమాట
విన్నవాఁడౌట, నృపసూతి విల్లొకింత
వంచి, శరమేసె దాని కుంభస్థలాన. 12

కోల తాఁక గజాకృతిఁ గోలువుచ్చి,
అబ్బురంపడి చూడ సైన్యంబు తన్నుఁ,
బడసె స్ఫురదంశుమండలి నడుమ నొప్పు
కాయము నభశ్చరం బతికాంత మదియు. 13

అంత నాదివ్యపురుషుఁ డయ్యజునిమీఁద
కురిసి కుసుమోపనత కల్పకుసుమవితతి,
రదనరుచిచేతఁ దారహారములు మెఱయ,
మెఱయ వాక్చాతురియు, నిట్లు నెఱి వచించె. 14

‘గర్వమున జేసి నే మతంగర్షి శాప
వశమున మతంగజత్వ సంప్రాప్తిగంటి;
తనరు గంధర్వపతి ప్రియదర్శనునకు
తనయుఁడ, బ్రియంవదుఁడ, నేను, ధర్మచరిత. 15

'వెనుక సాష్టాంగపడి నేను వేఁడికొనఁగ
నమ్మహర్షియుఁ దా మార్దవమ్ము నెనసె;
వేఁడి యనలాతపంబులఁ గూడిగాక
శైత్యమే గద నీటికి సహజగుణము. 16

'అవని నిక్ష్వాకువంశజుఁడజుఁడు నిన్ను
కోలఁ గుంభస్థలంబునఁ గొట్టునెపుడు
అప్పుడె వొందెదు మరల నీవపువు మహిమ'
ననుచు సత్కృప నాతపోధనుఁడువలికె. 17

'శాపమోక్షము నీచేతఁ జిక్కఁగంటి
చిరము నీరాకకే నిరీక్షించి వీర;
ఏను నీకుఁ బ్రతిప్రియమీయనేని
వ్యర్థమేగద స్వపదసంప్రాప్తి నాకు. 18

'కొనుము గాంధర్వము మదస్త్రమును బ్రయోగ
సంహృతి విభక్తమంత్ర మోసఖుఁడ నీవు;
పేరు సమ్మోహనము, లేదు వైరి హింస
తత్ప్రయోగికి, జయము హస్తంగతమ్ము. 19

'వలదు, ననుఁ గూర్చి లజ్జింపవల, దనుగ్ర
హించితివ యా క్షణమ్ము నన్నేయు నపుడ;
దాన నిన్నేఁడు నాపట్లఁబూనఁదగదు
నీవు ప్రతిషేధ పారుష్య భావసరణి.' 20

వల్లెయని యన్నదిక్ సోమభవను బాలు
శుద్ధజలమాచమించి నృసోముఁడాతఁ
డస్త్రవేత్త యుదఙ్ముఖుఁ డస్త్రమంత్ర
మును గ్రహించెను శాపవిముక్తు వలన. 21

ఇట్లు మార్గంబున నచింత్య హేతుకముగఁ
గలిగె వారికిఁ దైవయోగమునఁ జెలిమి;
చైత్రరథసీమ కొక్కఁడు ననియె, నొక్కఁడు
ననె విదర్భకు సౌరాజ్యచారుతరకు. 22

3 వి డి ది.

పుర సమీపంబునకు నజుఁడరుగు దేర
నతని రాకకు మిక్కిలి హర్ష మొంది
యెదురువచ్చెను గ్రథకైశికేంద్రుఁ డంత
నలలు పెరిఁగిన వార్ధి జాబిలికిఁ బోలె. 23

పురము సొత్తెర, నమ్రుఁడై మున్ను జనుచు,
సిరులనర్పించి, యజుని గొల్చెను నృపుండు;
మూఁగి చూచు జనుల్ దలపోయుచుండి
రజు గృహేశుగ, నాగంతు నట్లు భోజు. 24

ద్వారవేదులఁ బూర్ణకుంభంబెసంగు
కొత్త మేడకుఁ దదధికారులును ముకుళ
హస్తులై దారిసూపఁ, దానందువిడిసె
నజుఁడు, యౌవనమందు చిత్తజుఁడు వోలె. 25

౪ వైతాళిక గీతలు.

అక్కడ సుస్వయంవర సమాహ్వృత రాజకుమార లోకవకా
చక్కని కన్నె మిన్నను భృశంబెదఁగోరు రఘుప్రసూతికిక్
మిక్కిలి జాగొనర్చె నిసి నిద్ర కనుంగవ కందరాక, పె
న్మక్కువ రూపెఱుంగ నసమర్థయయౌ ప్రియకాంతకై వడిక్ 26

ఒత్తెను గర్ణకుండలము లున్నత పీనతదంసపాళి, శ
య్యోత్తరవస్త్రమర్దన సముత్సరణాంగనె మేని పూఁత, జా
జొత్తెను దూర్పు, మేల్కొలుపులొప్పఁగఁ బాడఁదొడంగిరంతన
త్యుత్తమబోద్ధఁ డాతనికి యుక్తవచస్కులు సూతపుత్త్రకుల్ 27

'కడసనె రేయి, యింకఁబడుకన్ విడువందగునయ్య, బ్రహ్మదే
వుఁడు విభజించియుండెఁ జుమి భూమిభరంబు ద్విధా, భవద్గురుం
డడరి వినిద్రుఁడై యొకట నాబరువున్ వహియించె, నీవునుం
గడమ కడన్ వహింపవలెఁ గాదె నృపోత్తమ, బుద్ధిమత్తమా 28

'నిద్దుర నంటి నీవునికి నెమ్మినదెల్ల నలక్ష్యపెట్టి, రే
ప్రొద్దున ఖండితాంగనయుఁబోలె సుధాంశువుపట్లు వేడుకన్
దద్ద యొకర్చె లక్ష్మియ, యతండును నిష్ప్రు దిగంతలంబియై
ముద్దగు నీమొగంబు రుచి మొత్తము వాయుచున్నవాఁడదే.

'కావున నేకకాలమునఁ గాంతముగా వికసించి పొందెదుం
గావుత దుల్యయోగ్యతను గ్రిక్కున నీయుభయమ్ము, నుల్లస
ద్భావచల త్కనీనికము తావకనేత్రము, నంతరంతరం
బావిచల ద్విరేఫమగు నంబురుహంబును నియ్యుషస్సునన్ 30

'సడలిన పూవులం దొడిమసంగడి వాపి హరించుఁజెట్లలో
నుడిగొను సూర్యరశ్మి విరజూపు సరోరుహరాజిలో, నిటుల్
వడయుఁగ సౌరభంబును భవన్ముఖవాయునిసర్గలక్షణం
బడరుఁ బ్రభాత వాత మిపు డన్యగుణగ్రహణైకలోలమై 31

'రాలుచు తామ్రరోచిరుదరంబుల భూరుహపల్లవంబులన్
గ్రాలెడి ధౌతహారగుళికా విశదంబులు మంచుబిందువుల్
నీలశితాధరోష్ఠమున స్నిగ్ధరదాంశువు లేతనవ్వుతో
మేలి గుణంబుపొందిక నమేయరుచిస్ఫురణన్ సమానమై 32

'పరముఁడు సుప్రతాపనిధి భానువు తా నుదయించులోపనే
అరుణుఁ డడంచివైచెను రయంబునఁ జీఁకటి మొత్తమెల్ల, సం
గరమున నగ్రభాగమునఁ గ్రాలఁ బరాక్రమశాలి వీవు, నీ
గురువు స్వయంబ శాత్రవులఁ గూల్చునయేమి కుమారభూవరా

'ఎడలెడి శయ్య నిష్ప్రభయపార్శ్వములం దగఁ దీర్చుకొన్నవై
నిదుర భవద్గజాళి, రవణించెడు సంకెల లీడ్చుకొంచు, బ్రా
గుదయ రవిస్ఫురత్కిరణయోగముచేతఁ దదీయ దంతముల్
కదుకొనివెల్ల భిన్ననగ గైరిక ధాతుతటంబులోయనన్ 34

'నిదుర గుడారసాలలను నీజవనాశ్వములంబుజాక్ష, యి
ప్పుడు నిదురందలంగి, తమముందట బెట్టినయట్టి లేహ్యముల్
కడిగొనఁ బూని సైంధవ శిలాశకలంబులు, నోటివేఁడి సో
కుడు వలనం బొనర్చెడిని గుప్పునఁ బ్రాప్తమలీమసంబుగన్. 35

'పలుచనయయ్యెడిన్ ననలు వాడుపుసెంద సుమోపహారముల్
వెలవెలనౌ నిజాంశుపరివేషసముద్యుతిఁబాసి దీపముల్
కలకలబల్కు నీదగుశుకంబిది పంజరమందు నిన్ను మే
ల్కొలుపఁగ మేము వల్కుపలుకుల్ కమనీయవచస్వితానునన్

వందికుమారు లిక్కరణిఁ బాడఁ గుమారుఁడు మేలుకాంచి, శ
య్యం దగఁ బాయునయ్యెను రయంబున, నున్మదరమ్యరావముల్
గ్రిందుగ రాజహంసములొనర్పఁగఁ దచ్ఛ్రితి సుప్రబోధమం
బొందిన సుప్రతీక మలవ్యోమసదీపులినమ్ము వీడెనాన్ 37

దివసముఖోచిత క్రియలు దీరిచి శాస్త్రవిధి ప్రకారమా
ప్రవిమల పక్ష్మలేక్షణుఁడు పార్థివపుత్త్రుఁడు, యోగ్యవేషముం
దవిలి ప్రసాధనాతిశయదక్షసహాయతమై, స్వయంవరో
త్సవశుభమంటపంబున వెసన్ నృపమండలిఁజేరె వేడ్కతోన్

౫ స్వయంవర మంటపము.

సకల సుఖోపచార విలసన్మణి మంచెల మీఁద భద్ర పీ
ఠికల నలంకరించిన కడిందికుమారులఁ జారువేషులన్
చకచకలాడు నాసభ నజప్రభుఁ డందఱ నారఁగన్గొనెన్
బ్రకట విమానచారులు దివౌకసులోయననౌ నృపాలురన్ 39

అవిరతి వేడికొన్ రతిఁ గృపార్ద్రమతిం గరుణించి, పార్వతీ
ధవుఁడీడ, స్వాంగమున్ మరఁ దాల్చిన కామునిపోల్కిఁ గ్రాలు నా
రవికులసూతిఁ గన్గొనిన రాజకుమారులు భావసీమ ని
క్కువముగ భోజరాట్సహజఁ గూర్చి నిరాశ వహించి రెంతయున్

అజుఁడు భోజ వినిర్దిష్ట మైన మంచె
విరచితంబైన సోపాన సరణి నెక్కె
రాలవరుసలపై మృగరాజశాబ
మెలమిఁ దుంగనగోత్సంగ మెక్కు నట్లు 41

అచట నాసీనుఁడౌటయుఁ బ్రచురవర్ణ
కంబళములొప్పు రత్నాసనంబుపైన
పోలె నాతఁడు కాంతిపెంపును వహించి
వాహనంబగు నెమలిపై వఱలు గుహుని 42

వరుసలుదీఱి యున్న నరపాల పరంపరలం దపూర్వహా
సురుచిరకాంతి చూపఱులచూడ్కికి మిక్కుటమై, సహస్రధా
విరచిత సద్విభాగమయి, విస్ఫుటమై, విలసిల్లె వారిదో
త్కరములపంక్తులన్ మెఱపు తళ్తళలీను విధంబు దోఁపఁగన్ 43

అట మహార్హాసనంబుల నధివసించు
మహిత నైపథ్యభృన్నృపమధ్యమందు
కాంతిచేఁ బొల్చె రఘుధరాకాంతసూతి
సారతరువులలోఁ బారిజాతమట్లు. 44

పౌరజనావళీనయనపాళి నృపాలుర నెల్ల మాని, సాం
పారు నజావనీశు పయి నప్పటికప్పుడె వ్రాలెఁ, బుష్పితో
ర్వీరుహ పంక్తిఁ బాయుచు ద్విరేఫచయంబు వనావనిన్ మదో
ద్గార సముత్కటోత్కటము గంధగజంబు పయిం బలెన్ దమిన్

రవిచంద్రవంశ్యులౌ రాజుల స్తోత్రంబు
లన్వయజ్ఞులు వందులాచరింప
కాలాగరుప్రయుక్తంబులౌ ధూపముల్
కలయఁ బతాకలం గ్రమ్ముకొనఁగ
ప్రాధ్మాతశంఖముల్ రచితశుభార్థముల్
తూర్యధ్వనుల్ దెసతుదలఁ బర్వ
తచ్ఛ్రితిం బ్రమసి యుద్యాన బర్హాలు సము
ద్ధతభంగి నర్తఁజేఁ దాండవింప

పరిజనమ్ములు చుట్టను బలసి మెఱయ
మోయ బోయీలు పల్లకీ మోహనాంగి
పెండ్లి వేషమ్ము దాలిచి వెడలి సొచ్చె
రాజకన్య మంచాంతరరాజవీథి 46

కన్యకాకృతి స్రష్టయనన్యసృష్టి
నయన శత కైకలక్ష్యము పయిన వ్రాలి
ఝల్లములచేత నరదేవు లెల్లరప్పుడు
మంచెలందుండిరి శరీర మాత్రమునన. 47

ఉ. రా జ చే ష్టి త ము.

కోరికలార నారమణిఁగూర్చి ధరాధిపపాళి క[illegible] శృం
గారపుఁ జేష్టలయ్యెను బ్రకాశముగాఁ బ్రణయాగ్రదూతికా
వారము, చైత్రలక్ష్మి కనుపట్టుటతోడఁ బ్రవాళశోభలు
ర్వీరుహరాజపంక్తులను వెక్కువిధంబులఁగ్రాలు కైవడిన్ 48

తుమ్మెదల లోలపత్రముల్ త్రోలి తాఁప
కలఁగుపుష్పాడి లోన చక్రమ్ము గట్ట
నాళముంబట్టి కేల్ద్రోయిఁగేళితమ్మిఁ
ద్రిప్పె గిఱ్ఱున నొక్క పృథ్వీవరుండు 49

హారము జాఱి వ్రేలఁగ నిజాంసమునుండి, మణిప్రవిద్ధ కే
యూరమునం గొనందగిలియుండగ నొయ్యన మీఁదికెత్తి, సా
చీరచితాననుండగుచు, చెన్నెసలార యథాప్రదేశముం
జేరిచె దానినొక్క నృపశేఖరుఁడు జ్వాలవేషుఁడర్మిలిన్. 50

నలువుగ నొకింత దిగువాఱ నయనశోభ
అంచితాగ్రాంగుళులవంచి యధిపుఁడొకఁడు
గోటి కాంతు లడ్డంబుగ దీటుకొనఁగఁ
బదముతో వ్రాయువాఁడయ్యె స్వర్ణపీఠి 51

ఆసనార్ధమునం దొక్క యవనినేత
యెడమ బుజమూనిచి తదంసమెగుడుగాఁగ
మెలియు వెన్నున హారము మెలిగొనంగ
సరస నెయ్యునితోడ ముచ్చటలుసలిపె 52

కొమ్మ హొయలుగ నిడు చెవి కమ్మయైన
తెలుపు పొలుపారు కేతకీదళముఁజీరె
బ్రమద పిఱుదున కలవాటుపడినవైన
నిజ నఖాంకురముల యువ నృపుఁడొకండు 53

కమ్రశతపత్రముం బలెఁ దామ్రతలము
స్పష్టరేఖాధ్వజాంకమహా పాణి నొక్క
పార్థివుం డెత్తినై చెను బాచికలను
వ్యాప్త రత్నాంగుళీయ ప్రభాఢ్యములను 54

తన కిరీటము తావును దలఁగకున్నఁ
దావు తలఁగిన దాని విధానఁ దడవె
ధారుణీశ్వరుఁడొకఁడు హస్తంబు నెఱపి
ప్రోల్లసందుల రత్నాంశువే మెసంగ. 55

౨ మ గ ధుఁ డు.

ఆలలినున్నదైన సభ నంత సునంద సమస్తధారుణీ
పాలుర వంశవృత్తములు పారమెఱింగిన ద్వారపాల, వా
గ్జాలమునందుఁ బూరుషుల గట్టితనంబలవడ్డచేడె, తా
నోలి వధూమణిన్ మగధునొద్దకుఁదోల్తనదెచ్చి యిట్లనున్.56

సరగ మగధేశ్వరుఁడగాధసత్త్వశాలి
రక్షణార్థులకెల్ల శరణ్యమూర్తి
ప్రజల రంజింపఁజేసి పేర్వడయురాజు
సార్థకాఖ్యుండగు పరంతపాఖ్యుఁడితఁడు. 57

ఇతరులు వేనవేలు ధరణీశ్వరులుందురుగాక యెందఱే
నితని కతంబునన్ భువి రహించును రాజవతీప్రతీతి, సం
తత ముడుతారకాగ్రహ వితాన సమన్వితయయ్యు రాత్రి, ని
శ్చితముగ నాసుధాకరుని చేతన జ్యోతిరుపాత్తపాత్రయా. 58

ఇతఁడెడ తెంపులేక వివిధేష్టిపరంపర సల్పువాఁడు, సం
తతము సహస్రనేత్రు నియతంబుగఁ బిల్చుటజేసి, యా శచీ
సతి యలకాళి కల్పతరుసంజనిత ప్రసవానవాప్తిఁ బ్రా
పితచిరవిప్రయోగమున వ్రేలు విపాండుకపోలపాళిపై. 59

సమ్మతిసేయుదేని నృపసత్తముఁ డీవరణీయమూర్తి
య్యమ్మనఁ బాణిపట్టుటశుభాంగిరో, పుష్పపురాంగనాసము
హమ్ములు మూఁగి రాజభవనాగ్ర గవాక్షములందు నేత్రప
ర్వమ్ముగ నిన్నుఁజూడఁగలవారు ప్రవేశమహోత్సవమ్మునన్ 61

ఇట్లు వల్క సునంద యానృపునిఁజూచి
రాకుమారి మూర్వాంక మధూకమాల
జాఱ నొక్కింత, ఋజుసమస్కారమునన
పరిహరించినదమ్యో నాధరణిపాలు. 62

ర అంగరాజు

అంత నావేత్రహస్త నృపాత్మజాత
నోజఁజేరిచె నింకొక రాజు కడకు
గాలిఁదెరలు మానసతరంగముల రేఖ
రాజహంసిని బద్మాంతరమును బోలె. 63

ఆతనిఁజూపి పల్కెఁ, గనుమా యితఁడంగధరాధినేత, సం
ప్రీతిని వీని యౌవనపుశ్రీకి మరుల్కొనుఁ జూపె యప్సరో
వ్రాతము, స్తోత్రకారులు సురర్షులె వీని ద్విపేంద్రశిక్షకుల్
ప్రాతిగ నమ్మహేంద్ర విభవం బిలయందున యాతఁడొందెడున్

వీని యరాతిభూపతుల వేడుకకత్తెల చన్నుదోయిపై
మానుగ వ్యాప్తమై పృథులమౌక్తికముల్ బలె నశ్రుసంతతుల్
దానగుణాభిశోభితుఁడు దారపుపోగులు లేని హారముల్
పూనిచెనో యితండనఁగఁబొల్పెసలారు సరోరుహాననా. 65

సిరియు వాణియు నీతనిఁజెంది యొకటఁ
బరఁగు భిన్నాశ్రయములు స్వభావమయ్యు
వన్నెచెన్నున సూనృతవాక్కువలన
యోగ్య వీవ తృతీయగా నుభయులకును. 66

అనుటయునిట్లు మాతృసఖి యంగధరాధిపుమీఁది చూడ్కిఁ చ
య్యన పెడవ్రాల్చి పల్కెఁబదమంచు విదర్భమహీశపుత్త్రి, యే
మనవలెఁ, గాఁడు కామ్యుఁడఁనా, నెఱనారయలేని దీమెయా
జనములలో రుచించుటలు సాజముగాఁ గడుభిన్నముల్గదా. 67

౯ అవంతిరాజు.

అంత దౌవారికి మఱొక్క యవనీనాథు
నింపు మీఱఁగఁజూపె నయ్యిందుమతికి
చూడఁదగు వాని శత్రులఁజూఁడువాని
పొడుపు గుబ్బలిపైఁ జంద్రుఁబోనివాని. 68

ఈతఁడవంతినేలు ధరణీశుఁడు, చూడు, ముదగ్రబాహుఁడ
త్యాతత వక్షుఁడున్, దనుతరాంచితవర్తులమధ్యముండు, ప్ర
ద్యోతను సానపైనిడి మహోద్యుతి నుల్లిఖితంబొనర్చె నా
ధాత యనంగ వెల్గెడు సుధాముఁడు, తామరసాయతాక్షి రో. 69

మహితుఁడీతఁడు వెడల సమగ్రశక్తి
మున్న సను వార్వములు రేపుచున్నధూళి
మాపు గావించుచుండు సామంతనృపశి
రోమణి వితాన తేజఃప్రరోహములను. 70

పాలకలోకమండితని భాగ్యమయూరె వసుంధరన్ మహా
కాలని కేతనుండగుచుఁ గ్రాలెడు నాశశిమౌళి సన్నిధిన్
మేటినివాసమౌటను దమిసప్రపు పక్షపు రేలఁగూడఁదా
నోలలలాడెడిన్ సుఖమహోదధిఁ గాంతలఁగూడి వెన్నెలన్. 71

యౌవనుండగు నీరాజుతో విహార
మొనరుప రుచించునోటు రంభోరు నీకు,
అల్ల శిప్రాతరంగానిలోల్లలనముల
బాహిరోద్యానవన పరంపరల దరుల. 72

భూరివికసిత బంధు సరోరుహౌండు
గాఢ శోషిత శాశ్రవ కర్దముండు
నైన యాతనిపై భావ మూనదామెఁ
దన్వి భానువుపైఁ గుముద్వతియుఁబోలె. 73

౧౦ అ నూ ప రా జు.

ఆ కుమారిని వారిరుహాంతరాభఁ
గలితసుగుణాఢ్యఁ గమలజు లలితసృష్టి
నోజఁ దా నాపుచు ననూపరాజు మోల
సుందరంబుగ మరల సునంద పలికె. 74

కలిగెను నీపవంశమునఁ, గాంచెను యజ్వపదాఢ్యగౌరవం
బలికులవేణి భూపమణి యైనయితండు, తదాశ్రయంబునన్
గలిసి గుణంబులొప్పు, విడఁగాంచి పరస్పరజాతివైరముల్
వలనుగఁ దాపసాశ్రమతలంబుల సత్త్వములొప్పుచొప్పునన్. 83

పరఁగును వీని కాంతి నిజవాసమునన్ నయనాభిరామమై
సిరిసహజన్మ నిండుకళ చెన్నున, వీని ప్రతాపమన్ననో
కరమువెలుంగు దుస్సహముగా నరిరాజుల మందిరంబులన్
విరివిగఁ బూరిమొక్కలు జనించిన హర్మ్యతలాగ్రరేఖలన్. 84

కన్నియ వీని యంతిపురికాంతల చన్గవ గందబూఁతలన్
బన్నగ క్షాళనం బొనరుపం బనుపొందు కళిందకన్య, తా
నున్నదె యయ్యెనున్ మధుర, నొప్పుగ గాంగతరంగసక్తసం
పన్నజల ప్రవాహ యన భాసిలు వారివిహారవేళలన్. 85

గరుడభయంబునన్ యమునఁ గాపురముం దగఁగొన్న కాళియుం
డరిదిగ నిచ్చుకొన్నదట యామణి, ఉరమ్ముపయిన్ సమగ్ర వి
స్ఫురణ రహించుచున్నయది, పోలఁగ దీని ధరించు వీఁడు హ్రీ
కరుఁడనఁగా నెసంగు నల కౌస్తుభధారికి విష్ణుమూర్తికిన్. 86

యౌవనవంతుఁడైన వసుధాధిపు నీతని భర్తఁగాఁగ సం
భావన సేయుదే, ననుభవంబగుఁ జైత్రరథంబువోని బృం
దావనమందుఁ బల్లవవితాన పరిచ్ఛదపుష్పశయ్యపై
యౌవనసత్ఫలమ్ము, భువనాఖిలరూపవిలాసహాసినీ. 87

సుందరముల గోవర్ధన
కందరముల శీకరార్ద్రగైరికగంధ
స్యంది శిలలఁ గూర్చొని యా
నందింపుఁడి నెమలి గముల నాట్యములు తఱిన్. 88

అన్యభూజానిరాజ్ఞి కాన్నైన యామె
వానిఁగడచి మనోహరావర్తనాభి
దారి నెదురైన ధారుణీధరముఁ గడచు
స్రోతసి సముద్రగామిని భాతిఁ జనియె. 89

౧౨ కాళింగుఁడు

అంగదాశ్లిష్టబాహు హేమాంగదాఖ్యు
దళితశాత్రవుఁ గాళింగు దఱియఁజేసి
లాలితాబాలచంద్రాస్య బాలతోడఁ
బల్కెఁ బరిచారిక సునంద ప్రౌఢి మీఱ. 90

ఇతనిఁగనుంగొనంగదె మహేంద్రగిరిప్రతిమానసారసం
యుతుని హేంద్రనాథుని మహోదధినాథుని నో విదర్భరా
ట్సుతరో, తదీయయాత్రలఁ గడుంగడు దానజలంబులోడ్చుచ
ప్రతిహతమేగు నేన్గుల నెపంబున మున్సనఁబోల్ మహేంద్రమే91

వీని ధనుర్ధరాగ్రగుని పేర్మిభుజద్వయి మీఁదటన్ ద్వయం
బైన గుణాంకరేఖ లలరారుఁ, దదుద్ధతిఁ బ్రగ్రహీకృతం
బైన విరోధి లక్ష్ములయు సాంజనబాష్ప నిషేకపద్ధతుల్
తానసయమ్ము బాహువులఁదాల్చెనొ యీసుభుజుండనందగున్

తనహర్మ్యంబున నిద్రవోవు నితనిన్ దత్సన్నికృష్టుండు మం
ద్రనినాదచ్యుతయామతూర్యుఁడు, లసత్ప్రాసాద జాలావలో
కన పాత్రీకృత భూరిభూషణతరంగ వ్రాతసంక్రాంతుఁ డొ
య్యనమేల్కొల్పునుజూవె నిత్యమల ప్రాచ్యాంభోధియే తానుగ।

తాళీవనమర్మరముల,
బాలా, వారాశిదరులఁ బ్రభువితనితోఁ
గేళిసలుపు, వెలిదీవుల
గాలి లవంగముల వలపుగతిఁ జెమరార్పన్. 94

మక్కువ పుట్ట నిక్కరణి మంపుగఁ బల్కియు నాభుజిష్య, తాఁ
జక్కదనంబు నెన్నఁగ రసజ్ఞయె యయ్యును భోజుచెల్లె లా,
చక్కదలంగి యేఁగెఁ, బురుషక్రియచేతను దూరకృష్టయై
పక్కకు వచ్చియున్, విధివరాజ్యముఖు లక్ష్మి తలంగి సన్నటుల్.

౧౩ పాండ్యరాజు

వారక పాండ్యనాగపురపాలకు నంతిక మంత డాసి దా.
వారికి రూపసంపద దివౌకసులం బురుడించు నాతనిన్
గూరిచి, 'చూడవే యిటు చకోరవిలోచన' యంచు ముందుగా
నారమణీమణిం బలికి, యాతని వర్ణన సేసె నీక్రియన్ 96

హారము లంసపాళిఁ జెలువారుచు వ్రేలఁగ, మేని పూఁత సొం
పారగ రక్తచందనము, ప్లాదకరాంగుఁ డితండు పాండ్యుఁ డే
పారెడి, లేతయెండ నెఱపారిన సానువులొప్పు నిర్ఝరో
ద్గారవిభూషితం బగుచు గ్రాలెడు పర్వతరాజముం బలెన్ 97

ఖ్యాతిగ వింధ్యపర్వతము గండడఁగించి, సముద్రమంతయున్
బ్రాతిగఁ గ్రోలి యుజ్ఝిత మొనర్చిన యట్టి యగస్త్యమౌని పం
క్తి ప్రీతిగ నీమహీశు హయమేధమఖావభృథార్ద్రమూర్తి సా
[illegible]తికుఁ డైన వాఁడు, నయశాలిని, యాతని పుణ్య[illegible]

ఈ నరనాయకుం డువిద యీశ్వరుచేత దురాప మస్త్రముం
దాను గ్రహించినాఁ డవుట, దందడి లంకవిభుండునుం జన
స్థానవిమర్దశంక నలస్వర్గము గెల్వఁగ దాడి వోవు వాఁ
డేనియు దృప్తుఁడయ్యెఁ జనియెన్ మును సంధి నొనర్చి వీనితోన్

తరుణి నీపాణి విధివిహితప్రకార
మిమ్మహాకులీనునిచే గృహీతమేని
కలితరత్నగుణార్ణవకాంచివైన
దక్షిణాశకు సవతివై తనరఁ గలవు 100

నాగవల్లీపరీరంభపూగతరులు
సమ్యగాలింగితైలకీ చందనములు
ప్రావృతతమాలపర్ణాస్తరణతలములు
మలయగిరి తావుల రమింపుమా సతమ్ము 101

నల్ల గలువల చాయ రాజిల్లు నితఁడు
శ్రీల దీవు గోరోచనాగౌరవర్ణ
వాండ్రొరుల శోభ మీఱు మీ యోగమునను
మెఱుపు మబ్బును గూడిన తెఱఁగు గాఁగ. 102

తెలివ గావించు నీ యుపదేశ మేమి
చోరవు గొనద వైదర్భ సోదరి యెడంద,
భాస్కరాదర్శనంబున బద్ధకోశ
మైన తామరం దారాధిపాంశుపట్లు. 103

చరదీపశిఖవలెం బతిం
వర కడచి చనియె నెవని నెవని నాయాభూ
వరుఁడు వివర్ణత నొందెను
పురి రాజపథంపు నట్టముం బలె రేయిన్. 104

౧౪ అ జుఁ డు

ఆ జవరాలు డాయ రఘునాత్మజుఁ డాత్మఁ దలంకెఁ, దన్నుఁ బే
రోజ వరించునో వలవదో యని, వెంటనె వాని యంగద
భ్రాజితబంధ ముచ్ఛ్వసనబంధురమై కుడి బాహు వందునన్
ద్యోజితముం బొనర్చె హృదయాంకురితం బల సంశయంబునన్

హారి కుమారి చేరుకొని యా సకలావయవానవద్య నిం
కేరి సమీప మేని జననేనిఁదలంపక యాఁగి పోయె, వి
స్ఫారసుమోపశోభితరసాలము చేరిన షట్పదాళి యు
ర్వీరుహ మింకొకం డెనయ వేడుక సేయునె యెన్న డేనియున్

ఉల్లము వానియందు దగులొందిన యిందుమతీకుమారినిన్
సల్లలితేందుకాంతిని సునంద విలోకన సేసి పొందుగా
నిల్లలిఁ బల్కఁగాఁ దొడఁగె నించుక విస్తరమొప్ప నంచదు
త్ఫుల్లవచోనిరూఢిఁ గ్రమముం గడుసుందరమున్ రహింపఁగన్

పార్థివోత్తంసుఁ డిక్ష్వాకువంశభవుఁడు
చెలఁగె నాహితలక్షణుఁ డల కకుత్స్థు,
డర్థిఁ గాకుత్స్థ సంజ్ఞ శ్లాఘ్యము ధరింతు
రున్న తేచ్ఛ లుత్తర కోసలోర్విపతులు. 108

తాను మహోక్షరూపమును దాల్ప మహేంద్రుఁడు, వానిమూఁపునన్
జానుగ నెక్కి, పోరునఁ బినాకి విధంబునఁ బేర్చి, బాణ సం
ధానపు నేర్పు పెంపునను దానవకాంతల గండసీమపై
మానిచెఁ బత్త్రరేఖలను మానవనేత కకుత్స్థుఁడుగ్మలీ. 109

పౌరకరి నప్పళించుట సడలియున్న
బాహుపురి బాహుపురి రాయ భాసురముగ
నింద్రు నర్ధాసనంబును నెక్కినాఁడు
ప్రాజ్యమూర్తి కకుత్స్థుఁడు పక్ష్మలాక్షి 110

వానికులంబునందు ప్రభవంబు గనెఁ గులదీపుఁడైన భూ
జాని దిలీపుఁ డూర్జితయశస్కుఁడనుత్తముఁ, డాశతక్రతుం
డూనిన యీర్ష్యభావము ననూనముగా దొలఁగింపనైన యే
కోనశతక్రతుత్వమున నొప్పుగ నిల్పినవాఁడు కోమలీ. 111

అతఁడు ధారుణి శాసించునప్పు డతివ-
నిజవిహారార్థపథమున నిద్రగాంచు
వాణినుల యంశుకంబుల వాయువేని
గదలుపఁడు, దొంగిలం గయి జాఁచు నెవఁడు. 112

అతనికుమారుఁడైన రఘు వా పద మేలెడు నిష్ఠ,విశ్వజిత్
క్రతువొనరించినాతఁడు, యథావిధి నాలుగుదిక్కులూడ్చి సం
భృతమొనరించుకొన్న నిఖిలేద్ధవిభూతిని దక్షిణార్థ మం
చితముగ నిచ్చుచో నొనరించెంగద మృణ్మయపాత్రశేషమున్

అద్రిలెక్కియు దాటి సముద్రములను
అహికులంబుల యావాసమందుజొచ్చి
ఊర్ధ్వమొంది యవిచ్ఛిన్నమొప్పుచున్న
యతని యశమింతయని కొల్వ నలవికాదు.

ఆ కృతకృత్యు సంజనితుఁడైన కుమారుఁ డజుం డితండు స్వ
ర్లోకము నేల్ మహేంద్రుకొమరుండు జయంతునిఁబోలు, వీఁడు పెన్
వ్రేకము భూమిభారము ధరించెడు తండ్రికిఁ దాను నీడుగాఁ
బ్రాకటమయ్యె ధూర్వహుఁడు పాయని దమ్యదశాంతరంబునన్

కులము రూపము పరువంబు కలిమి యందు
వినయముఖ్యము లాయాయి గొనములందు
నీకు సరితూఁగు నితఁ డీతనిన్ వరింపు
కాంచనముతోడ రత్నమ్ము కలయుగాత. 116

నాణెముగ నిట్లు వల్క సునంద యుండ
రాకొమారిత లజ్జ తనూకరించి
సుప్రసాదామలంబైన చూడ్కివలన
అజు వరించెను వరణమాల్యమునఁబోలె. 117

ఆ నృపసూనుపైన నలరారెడు ప్రేముడి నాకుమారి శా
లీనత పెంపునన్ నుడువలేనిద యయ్యెనుగాని, వెల్వడెన్
తాన యరాళకుంతల యుదంచితభావము గాత్రయష్టినిన్
జానగు పుల్కమొల్కలను సాకున భేదిలి సత్వరంబునన్ 118

ఇట్లు తనరారు తన సకి నిందుమతిని
వేడ్కఁ బరిహాసముగఁబల్కె వేత్రవతియు
'పద పద మఱొక్క భూపాలు పాలి'కంచు
వధు వసూయ విలోకింప వక్రదృష్టి. 119

౧౫ వరణము.

ఆ రఘుపుత్త్రి కంఠమున నర్హ్వాతలంబున దాదిచేతు లా
ధారమునేసి సంవరణదామము మంగళచూర్ణగౌరమున్
భూరితరానురాగమది మూర్తమనాఁ గరభోపమోరు విం
పారఁ దవిల్చె నంత సకలావనిపాల సభాంతరంబునన్. 120

తన వెడందయురమ్మునఁ దగిలి వ్రేలు
మాల్యమును దాని శుభపుష్పమయముఁ దలఁచెఁ
గంఠమును బాహువల్లులఁ గౌఁగిలించి
వ్రేలు వైదర్భిగాఁగ వరేణ్యుఁడతఁడు. 121

జలధరముక్తమైన శశి సంగతిఁ గ్రాలెడి జ్యోత్స్నవోలె, నా
జలనిధిఁ గూడుకొన్నదగు జహ్నుసుతన్ బలె, నీ వధూటి సొం
పొలయునటంచుఁ దుల్యగుణయోగ సుహర్షితు లేకవాక్యముం
బలికిరి పౌరులెల్లరు, నృపాలురకుం జెవిసేఁదు సేయుచున్. 122

ఉల్లసిల్లెను వరుపక్ష మొక్కచోట
ఇంకొకట రిక్తవోవు మహీశకోటి
కమలములు విచ్చి, కుముదజాతములు మొగిడి
వేగుతఱి నొప్పు కొలనయ్యెఁ బెండ్లికొలువు. 123

ఉ. ప్రవేశోత్సవము.

పన్నగనాథుమూరుఁగయివట్టి వెలింగెను దేవసేన నా
నన్ని విధంబులం దగిన యవ్వగఁ గూడిన సోదరీమణిన్
సన్నుతమూర్తిం గలిసి చక్కవిదర్భధరాధినేత యం
తన్నగరప్రవేశము నొనర్పఁ బ్రయత్నపడెన్ ముదంబునన్. 124

విడిదల లుర్వీపాలురట వేగముగా విడువారలైరి తే
జెడలి ప్రభాతవేళ ద్యుతిహీనములైన గ్రహంబులట్టులై
పొడవఱి భోజ్యపట్ల వృథవోవుటఁ జేసి మనోరథంబులున్
చిడిముడి నేవగించుకొను సిగ్గరులై తమ రూపవేషముల్. 125

అల శచీదేవి సాన్నిధ్యకలనఁ జేసి
కలుగవ స్వయంవరంబునఁ గలఁత లేమి;
తారు కాకుత్థ్సునెడ సమత్సరులె యయ్యు
ధరణి పాలురు శాంతిని దలఁగరైరి. 26

కలయ నవోపచారములు గ్రాలఁగ, నింద్రధనుస్సులో యనన్
వెలయఁగఁ దోరణంబులు, నవీనత నొప్పెడు రాజమార్గమున్
బొలసె వరుండు వెంట వధువుం జను దేరఁగఁ, బందిరిం బలెన్
లలి బహుళధ్వజంబులు దొలంపఁగఁ వారల కెండ సోఁకులన్ 127

వారిఁగన్గొనవలయు తత్పరతచేత
నుల్లసిల్లుచుఁ బెఱపను లెల్లఁబాసి
మేడలం గ్రాలు పౌరకామినులు వేగ
స్వర్ణజాలములం జేరు వారలై రి. 128

పిలపిల్లచూడఁబోవు నొక బిత్తరి పూసరులెల్లరాలి వే
నలి విడిపోయినన్ గరమునన్ మఱి దానిని బట్టుకొంచు న
వ్వఁనుననే రహిం జనె నవశ్యముగా, ముడివైచు కొందమన్
తలఁపొక యింత దూఱదు మనంబు, గవాక్షముఁజేరునంతకున్

ఇంకొకర్తె కైసేత రహింపుచుండి
కాలివ్రేళ్లకుఁ బారాణి నోలిఁబూసి
ఆఱులోపల గునగున నరుగసాగె.
జాల పర్యంతమును లాక్షచాఱలలర. 130

ఎడమకంటికిఁ గాటుక నిడుకొని మఱచి
పెట్టి కాటుకఁ గుడికంటి కట్టె వోయె,
గుంచెఁ గయిదాల్చియే యొక్క కువలయాక్షి
మేడ కిటికీల వరుస సమూహమునకు. 131

కేరి వాతాయనమున నిగిడ్చి చూడ్కి
రాకలో వీడిపోయిన పోకముడిని
కట్టక యొక త్తె చీరఁ గై వట్టి నిలిచెఁ
బొక్కిలిం జొఱఁ జేతిసొమ్ముల మెఱుంగు. 132

సగము కూర్చిన కాంచితో సత్వరమున
లేచి యొక్క తె మణులురలించుకొంచు
పఱచెఁ బదపదమున జాఱువాఱు కాంచిఁ
గాలి బొటనవ్రేలి మొదలను నూలు మిగుల. 133

తమకము మీఱ నిక్కరణి దర్శనలోలుపలై పురాంగనల్
గుమి యయినన్, గవాక్షములు, లోలవిలోకనచంచరీకయు
క్తములయి గర్భితాసవసుగంధములైన తదాననంబులన్
గమలచయంబునంబలె నికామ మలంకృతమై విరాజిలెన్. 134

హాళి రాఘవుఁ జూడ్కులఁ గ్రోలు వారి
కనుభూతములే విషయాంతరములు,
వారి శేషేంద్రియముల వ్యాపారమెల్ల
కనుల సర్వాత్మకతఁ జొచ్చెఁగావలయును. 135

"ధరణిపులం బరోక్షమ యథార్థ మెఱింగినదయ్యున్ స్వయం
వరమ హితంబు గాదె తలఁపంగ విదర్భకుమారి కీమె, కి
క్కరణిని స్వానురూపుఁడగు కాంతుని నీతని విష్ణుమూర్తి నిం
దిర వలెఁ దాను బొందఁ గలదే మఱి వేఱు విధాన నేమిటన్

"వీరి స్పృహణీయసౌందర్యసారనిధుల
నిర్వరఁ బరస్పరము కూర్పఁడేని బ్రహ్మ
అతని రూపవిధానప్రయత్న మెల్ల
వంధ్యమే యగుఁ గాదె యీ ద్వయమునందు. 137

"నిక్కమ యీ వధూవరులు నేల జనించిన యీ రతిస్మరుల్
చక్క వరించెఁ గాదె నృపచక్రము మధ్యను నాత్మతుల్యు నీ
చక్కనివాని బాల యిది సంశయ మూనక, మానసమ్ము తా
గ్రక్కున నెట్లొ గుర్తెఱుఁగుఁ గాదె భవాంతరసౌహృదంబులన్

ఇట్లు పౌరాంగనల నోట నింపు మీఱ
వెల్వడు సుధామయోక్తులు వీనువిందు
లజుఁడు వినుచు సంబంధి గృహంబుఁ జేరె
బహుళమంగళరచనావిభాసితంబు. 139

౧౭ కళ్యాణము.

చతురముగాఁ గరిన్ డిగి వశానికటంబునఁ, గామరూపభూ
పతి కయిదండ నీయఁగను, బావ విదర్భుఁడు దారి చూపఁగా
నతులితమూర్తి కోసలధరాధిపసూతి వివాహమంటపం
బతివల మానసాంతరము నట్లు ప్రవేశ మొనర్చె వేడుకన్ 140

అధివసించి మహార్హ సింహాసనమున
నతఁడు మధుపర్కమిశ్ర మర్ఘ్యముఁ సరత్న
మమల వస్త్రయుగంబు భోజార్పితంబు
నందుకొనె నంగనాకటాక్షాళితోడ. 141

చారుదుకూలముల్ వధువు సన్నిధిఁ జేర్చి నతండు నంత వి
స్ఫారనయావరోధపరిపాలుర చేతఁ గ్రమం బెలర్ప, వి
ప్పారెడు మర్త్యమొత్తముల నభ్యుదితేందుమయూఖపాళిచేఁ
బేరిమి మీఱ నంబునిధి వేల సమీపముఁ జేర్చు కైవడిన్ 142

పూజ యొనర్చె నాపిదప భోజపురోహితు నగ్నికల్పుఁ, డే
రోజను నాజ్యముఖ్యముల హోమ మతం డొనరించి, లోకవి
భ్రాజితధర్మపద్ధతి వివాహము సాక్షిగ నగ్ని నిల్పి, సం
యోజనముం వధూవరుల కోలి ఘటించె ముహూర్తవేళకుఁ

వధువు కేలిని గేల భూపాలసుతుఁడు
లెస్స గ్రహియించి మివుల వెలింగె నపుడు
చెంతఁ గం కేళితీవఁ గ్రొంజివురుఁ జివురు
చే గ్రహించిన తియమావి చెన్ను దోఁప. 144

వరుని ముంజేయి కడు గగుర్పాటు నొందెఁ;
గోమరిత కరాంగుళుల్ నునుజెమరు వట్టె;
వారి పాణిసమాగమపర్వమందుఁ
బడసె సరిపంపకము చిత్తభవుని వృత్తి. 145

సరసత సాగె నొండొరుల చక్కటికిం మెలమెల్లగాఁ, బర
స్పర మెదురైన తత్క్షణము పర్వెను వెన్కకు, నిండుసిగ్గు పెం
బరువున మోడ్చు నెందెను, శుభస్థితి రమ్యతరంబులై, పర
స్పరసువిలోలముల్ కడు విభాసిలె వారి విలోచనాబ్జముల్ 146

జ్వాల లుప్పర మెగబ్రాల్చు పావకునకు
నా యుగంబు ప్రదక్షిణ మాచరించెఁ
బవలు రాత్రియు నొండొరుం దవిలి మేరు
పర్వతము చుట్టునుం బోవు భాతి దనర. 147

బ్రహ్మకల్పులు గురువులు పనిచి నట్లు
లాజలను వేల్చె నగ్నిఁ బేరోజ వధువు
గురునితంబిని మత్తచకోరనేత్రి
యిందుమతి డెందమున సిగ్గు గ్రందుకొనఁగ. 148

ఎల్ల శుభపరిష్కారము లహీన మిటుల్ నెఱపన్ హవిశ్శమీ
పల్లవలాజసౌరభము పావకజన్యము పుణ్యధూమ మ
ల్లల్ల వధూకపోలతలి నాడు శిఖావళితో రహించె నా
నల్లలితాంగికిన్ క్షణము సంభృతకర్ణనవోత్పలాభమై. 149

కాటుక కరంగి కనులు కన్నీటఁ గలఁగఁ,
గరము వాడ యవాంకుర కర్ణపూర,
మొఱ్ఱవడఁ జెక్కుఘుల్, మొగ మింపు మీఱెఁ
గాంత కాచారధూమసంగ్రహణమునను. 150

పైడిపీటలఁ గ్రాల్ వధూవరులు వారు
స్వీకరించి రార్ద్రాక్షతల్ శిరములందు
వరుసగా స్నాతకుల్ కులబాంధవులును
పుడమిపతియుఁ బురంధ్రులు నిడఁగఁ బేర్మి. 151

౧౮ అంపకము

జరిపి యాత్రక్రియఁ జెల్లెలి పరిణయమును
భోజకులదీపుఁడు సమృద్ధిభాజనుండు
అవనిపుల కొక్కొకళ్లకు నర్హణముల
నాచరింపఁగ నియమించె నధికృతులను. 152

వెలిని బ్రమోదచిహ్నములు, వికిృయ గూఢమునై తనర్చ,లో
పలను మొసళ్లు పుట్టలయి, పైకిఁ బ్రసన్నములౌ కొలంకులుం
బలె నల పార్థివుల్ తమరి వంతు సమర్హణలెల్ల వెండి కా
న్కల మిష నిచ్చు కోల్ నెఱపి, కాంచి యనుజ్ఞఁ బ్రయాణమై
రొగిన్ 153

ఆ నరపాలు రంతఁ బ్రమదామిషమున్ సమయోపలభ్య మె
త్తైన గ్రహింప నెంచి వెరవారసి మున్నుసుకొన్న తీరునన్
జానుగ జాయ తోడఁ బయనంబయి వచ్చు రఘుప్రసూతి మా
ర్గానను గాచి యుండి రవకాశముఁ జూచి సముద్యమింపఁగన్

భోజుఁ డనుజాత పెండ్లి సంప్రాప్తి యగుడు
తన మహోత్సాహమునకును దగిన యట్లు
కలిత సంపద లరణంబుగా నొసంగి
అంపక మొనర్చి, రాఘవు ననుగమించె. 155

అరిగి సగదారి త్రిభువనఖ్యాతుఁ డజుని
తోడ, భోజుఁడు తాఁ బుచ్చి మూఁడు రేలు
అతని వీడ్కొని మరలెఁ, బర్వాంత మందు
సూర్యు వీడ్కొని మరలెడి సోము పగిది. 156

## ౧౯ ఆ హ వ ము

ఒకరొక రెల్ల రాజులును నోడ్వడి మున్ను స్వకీయసందదల్
ప్రకుపితు లౌట కోసలధరాపతి పట్ల, మఱిప్పు డేకమై
సకలురు గూడి యుండఁ, జెలుచన్ లలనామణియున్ దదీయ పు
త్రకునకు లభ్య మౌట యెడఁదన్ సహియింపర యెంత యేనియున్

భోజకన్యను దోడ్తెచ్చు రాజు నతని
మార్గ మడ్డెను దృప్త రాణ్మండలంబు
బలి యొసంగు సిరిం గొను నల త్రివిక్ర
ముని పదము నింద్రశత్రు వడ్డిన విధాన. 158

వధువునకుఁ గాపు వెట్టి పెన్బలము తోఁటి
సచివునిఁ బిత్రుకగ్రిమాగతు, సరభసమున
రాజవాహిని నెదిరించె రాఘవుండు
గంగ నల శోణ యత్యుత్తరంగ వోలె. 159

రౌతు రౌతు, పదాతిఁ బదాతి, రథికు
రథికుఁడు, గజాధిగతు గజప్రస్థితుండు
నిట్లు సరి సరి నెదిరింప నెసక మెసఁగె
నప్పుడు వీరాహవంబు భయంకరముగ. 160

తూర్య ఘోషణలం బల్కు దూఱ రాఁమి
నుచ్చరింపర నోటఁ గులోర్జితాఖ్య
లెఱుక వఱతురు విలుదాల్పు లఱఁ దొరంగి
తమ తమ ప్రశస్తి బాణాక్షరముల తోఁనె. 161

వారువము లెగరేపఁగఁ, దేరి గముల
చక్రధాటికి దట్టమై, సామజముల
కర్ణ తాడనములఁ గడల్ గ్రమ్ముకొన్న
ధూళి దుప్పటి వడువున హేళిఁ గప్పె. 162

వీచు గాలికి నోళులు విచ్చుకొన్న
మత్స్య కేతువులు చమూ దుమార పటలిఁ
ద్రావఁ బోలు, యథార్థమత్స్యములు కలఁక
లైన వాహిని క్రొన్నీర మాను కరణి. 163

చక్ర నిస్వన సంజ్ఞచే స్యందనమును
చలస ఘంటా క్వణన సంజ్ఞ సామజమును
స్వామి నామ గ్రహణ సంజ్ఞ స్వపర భేద
మెఱుఁగ నయ్యెను, బెంధూళి తెఱపి లేమి. 164

ఆజి నాలోకమార్గము నావరించి
కడు విజృంభించిన రజోంధకారమునకు
ఆయుధ క్షత యోధ గజాశ్వ జన్య
రుధిరవాహిని బాలార్క విధి వహించె. 165

నెత్తురులు నిండు వాఱుచో నేల వదలి
పై కెగసి గాలిలోఁ దూలు వడుచు ధూళి
నిప్పుకల్ మెఱిలాడుచు నిలుచు మున్న
నగి నెగఁ బర్వు పొగ చంద మగుచుఁ దనరె. 166

వ్రేటు వడి సొమ్మసిలి తెప్పిరిలి రథస్థు
లశ్వములఁ ద్రిప్పి యున్న సూతాళిఁ దెగడి
మున్ను లక్షించి సాధించి యున్న కేతు
వులనె మఱి వ్రేసెదరు రోషనిలయు లగుచు. 167

హస్తకుశలురు విలుదాల్పు లంపు శరము
లరి శరచ్ఛిన్న మయ్యు మార్గార్ధముననె
తునుమనే తున్మె లక్ష్యముం దొలి సగంపు
టల్లు మొన పర్వ నాత్మజవానువృత్తి. 168

దుస్సహ గజాహవమున నాధోరణులయు
తలలు క్షుర చక్ర నిశితాగ్ర ధాటిఁ దెగియు
జుట్టు డేగల గోళ్లకుఁ జుట్టుకొన్న
కతమునం బెద్ద తడవు సంపతన మొందె. 169

వ్రేసి తొలి మఱి వ్రేయఁ డాశ్వికుఁడు పోర
నెదురు వ్రేటిడఁ జాలని యెదిరి గాతు;
వాజిపై వ్రాలి యున్న యవ్వాని యొడలు
తిరిగి యూపిరితో లేచి తిరుగఁ గోరు. 170

తనువు దొరఁగు మయిమఱువుదాల్పు దొరల
విచ్చుకత్తుల సంపాతవృత్తి వలన
పొడవు దంతాల రగులు చిచ్చుడుగ జేయుఁ
జెడ్డ జడియు కరుల్ కరశీకరముల. 171

ఫలము లమ్ముల డొల్లిన తలలు గాఁగ
చషకములు గాఁగఁ జ్యుతశిరస్త్రాణములును
మహితరణతలి శోణితమద్యకుల్య
మృత్యుదేవత పానభూమిగ రహించె. 172

విహగములు ముక్కునం దుంచి విసరివైవ
పొంతఁ బడియున్న భుజఖండమును గ్రసించు
క్రోష్ట్రి పిశితప్రలుబ్ధయె కొఱికి విడిచె
బాహుపురికోటి తాలువుఁ బాధ వెట్ట. 173

పగతు కరవాలమునఁ దల తెగిన యొండు
భటుఁడు తోడ్తో విమానాధిపత్య మొంది
అచ్చర రహింప వామాంక మందు, దాన
సమరతలి నాఁడు; తన కబంధమును గనియె. 174

ఒక రొకరి సారథులఁ గూల్చి యుభయరథులు
సారథుల్ రథు లిర్వురు తారె యగుచు
వార్వముల్ దెగ, గదలఁ జేపట్టి, పోరి
గదలు వ్రియ్యఁగ, దిగిరి కైకయ్యమునకు. 175

ఒండొరులఁ గూల్చి కూలిన యుభయవీరు
లొక్క క్షణముననే ప్రాణ మోడి నంత
నొకతె నచ్చరఁ బ్రార్థించుచున్న వారి
కయ్యెఁ గయ్య మమర్త్యత్వ మందికొనియు. 176

ఉభయసేనలు దాఁకి యొండొంటి నొంద
భంగపాటును జయము వ్యవస్థ లేక
గాలి వెన్నను ద్రోసెడి క్రమము కొలఁది
లలి విజృంభించు వారాశి యలలు పోలె. 177

పరబలంబున స్వబలము భగ్నమయ్యె
నతిబలుఁ డజుండె యరిసేనఁ బ్రతిఘటించె;
గాలి యెదురొచు మరలుచుఁ గాక పోగను
పొరక యున్నెడనే యగ్గి పరఁగుఁ గాదె. 178

రథి నిషంగి కవచి ధనుర్ధరుఁడు దృష్టుఁ
డేకవీరుఁ డతం డాఁగె నృపతిసమితిఁ;
బ్రళయవేళ నుద్వేలమౌ వారివాశి
జలముల మహావరాహము నిలుపునట్లు. 179

శరధిముఖమున సవ్యాపసవ్యహస్త
మెడయ కాడఁ బ్రయోగమ్ము లెఱుక వడవు;
చెవి వఱకు నొక్కపరి లాగఁ జెలఁగు మౌర్వి
తాన శరము లరిఘ్నము లీనఁ బోలు. 180

క్రోడు గఱచుట కెరలి కెంపడరు మోవు
లూర్ధ్వరేఖల నీను భ్రూయుగళి ముడులు
దళితగళములు హుంకారకలితము లగు
పగఱ తలల నిలం గప్పివైచె నజుఁడు. 181

హస్తిముఖ్యము లఖిలబలాంగములయు
కవచభిద్వ్యఖిలాయుధనివహములయు
సర్వయత్నములం జేసి సకలనృపులు
పోరఁ గాకుత్స్థున్ బాధించు వారలైరి. 182

అరిజనాస్త్రవ్రజచ్ఛన్న మగుడు తేరు
కనఁబడె ధ్వజాగ్రమాత్రము కతన నజుఁడు
మంచున మునింగి యుంట నొకించుకంత
తోఁచు రవిచేతఁ బ్రాతస్సు తోఁచు నట్లు. 183

అంత నధిరాజసూతి సుమాస్త్రమూర్తి
జాగరూకుఁ డజుండు రాజన్యసమితి
పయిని, బ్రస్వాపనము బ్రియంవదగృహీత
మౌ మహాస్త్రము గాంధర్వ మడరఁ జేసె. 184

విల్లు పట్టిన చే యట్టె డిల్లవోవ
జాఱ నేకాంసమున శిరస్త్రాణపటలి
స్వాపపరవశమై ధరాపతుల సేన
కూలఁబడియె ధ్వజస్తంభపాళి నంటి. 185

## ౨౦ విజయము

అంత దయితాప్తమాధుర్యమౌ నిజాధ
రోష్ఠముం జేర్చి శంఖము నూదె నజుఁడు
తనువు గొన్న స్వహస్తార్జితము యశమ్ముఁ
ద్రావుచున్నాఁడనాఁ దనరారెఁ బేర్మి. 186

శంఖనాదము గుర్తించి స్వభటులెల్ల
మగిడి వచ్చి సుషుప్తారి మధ్యఁ గనిరి
ముకుళితములైన తామరపూల నడుమ
వెల్గు ప్రతిబింబచంద్రుఁ బోల్ వీరు నతని. 187

'రాఘవుం డిష్టు మీ యశోరాశిఁ గొనియెఁ
గనికరంబునఁ బ్రాణముల్ గొనఁడ' యన్న
వర్ణములఁ గూర్చెఁ బార్థివధ్వజములందు
రక్తదిగ్ధశిలీముఖాగ్రముల నతఁడు. 188

బాహు వొకటి ధనుష్కోటి పైన నునిచి
తొలఁచి శీర్షణ్యముఁ, ముడిఁ గలయ విచ్చి
స్వేదజలబిందులు లలాటసీమఁ దోఁప
నిలిచి, వెఱచిన ప్రియ మోములఁ బలికె నిట్లు. 189

'అరులు వీరలె యర్భకహార్యశస్త్రి,
లియ్యకొంటిని, వీక్షింపు, మిందుమతిరో
వీరు సంగ్రామచేష్ట నీవ్విధము గాఁగ
నాకు హస్తంగతులు, నీకు నతులొనర్తు.' 190

అనుటయుఁ దోలంగ రిపుసంభవార్తి యెల్ల
యిందుమతి మోము భాసించె నింపు మీఱఁ
దోలఁగ నిట్టూర్పులును బాష్పములును, సహజ
ధర్మముఁ బ్రసాద మెనయు నాదర్శమట్లు. 191

హర్షిలియు, సిగ్గు పైకొన్న యామె పొగడె
స్వయము గాక సఖీవాక్యసరణిఁ బ్రియుని;
పొలయు క్రొక్కారు వృష్టి నుప్పొంగు స్థలియు
నెమలి కేకల నభ్రబృందమును బోలె. 192

అనవద్యుం డిటు లా రఘూద్భవుఁడు రాజానీకశీర్షావనిన్
దన వామాంఘ్రిఁతలంబు వెట్టి యనవద్యన్ భోజ్యఁ గూడంగ న
య్యెను; దత్స్యందనసైంధవోత్థితరజోభృత్కర్కశాగ్రాలకల్
దనరన్, దేవి తనర్చె గెల్పుసిరిమైదాల్పు మెయో యన్నటుల్

జయమును శ్లాఘ్యజాయ నిటు చక్కఁగఁ
జేకొని రాఁ, గుమారు నెం
తయుఁ గొనియాడె నా రఘు వుదంతము
సర్వము మున్నె యుంగనై;

వయిచి కుటుంబభారమును వాసిఁబయిం,
జనఁ గోరె శాంతికై;
నయమతు లుందురే గృహమునన్
రవిజుల్, కులధుర్యు లేర్పడన్. 194



# సవరణపత్రము

| పుట. | పద్యం. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 9 | నాక్క | నాక |
| 20 | 78 | దుర్యశంబునఁ | దుర్యశంబునుఁ |
| 21 | 80 | యొడసిరి | యొడిసిరి |
| 24 | 91 | హేంద్రనాథుని | మహేంద్రనాథుని |
| 24 | 94 | సలువు | సలుపు |
| 25 | 97 | నిర్ఘరో | నిర్ఝరో |
| 29 | 113 | నొవరిగాంగద | నొవరిచెంగద |
| 32 | — | ఁ | గఁ |
| 40 | 157 | సందదల్ | సంపదల్ |
| 48 | 190 | నీవ్విధము | నివ్విధము |